శ్రీరస్తు.

# శ్రీ రసికజనానందోదయ పదములు.

ఇది

శ్రీలక్ష్మీనారాయణ చరణారవింద సేవితుండును నల్లూరి
వంశ పయఃపారావార రాకాసుధాకరుండును విఖనస
కులాలంకారుండును వేంకటాచార్య తనూభవుండగు
నల్లూరు నరసింహాచార్యులగారిచే సుఖవాసివంశ
దుగ్ధకూపార కుముదబాంధవుండును నల్లూరు
పాలెగ్రామ విలేజికోర్టు తీర్పులయందు నైపు
ణుండగు నారయగారి ప్రోత్సాహమువలన
రచియింపబడి

---

శ్రీ పేరుకలపూడి వేణుగోపాల కరుణాకటాక్ష
సంలబ్ధ సరసకవితాధుర్యులగు శ్రీమాన్
పరాశరం శేషాచార్యులవారిచే
బరిష్కరింపంబడి

---

మ॥రా॥రా॥శ్రీ॥ కొమ్మూరిపుల్లయ్యగారి
స్వకీయ
బాపట్ల శ్రీకన్యకాపరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపింపఁబడియె.

1914.

---

# విజ్ఞాపన




—(o)—

తే॥ గీ॥ గ్రామమునసఫ్ వ్యాసులు • స్థానముగాను
జదివి సర్కారునుద్యోగి • మ[illegible] వ్రాసి
కెక్కి గ్రామతీర్పులయందు • నిపుణమైన
నవ్యగుణచంద్ర నారయ • నామధేయ॥

ఆర్యులారా!

మత్ప్రాణసఖుండును నేనువసంతకాలమందొక దినాంతమునందు మలయమారుతమీచుచుండ సీతారామస్వామివారి కోవెలముంగిట ధ్వజస్తంభము వేదికపై సుఖాసీనులమై ఇష్టాగోష్టికథలు సల్పుచుండగ మదియ్యామాముపంకవీక్షించి మిత్రమా. నరసింహాచార్యులగారు భక్తిరసపూరితమైన నొకకొన్నికీర్తనలు, శృంగార రసపూరితమైన నొకకొన్నిజావళీలు, కొన్నిమంగళహారతులుగూర్చి నొకకబ్బము జెప్పుమని ప్రోత్సాహము జేయ నాలాగున నేయని నంతట రసాత్మజాప్రియుని మనంబుననుతించి నీవిధంబుగా జెప్పదొడంగినాడ. కవీశ్వరకోవిద భూసురులార నీపొత్తమునందలి తప్పులున్న నొప్పులుగాభావించి మన్నింతురుగాక.

వలయువారు నీదిగువవిలాసమునకు వ్రాయవలెను.

ఇట్లు విధేయుడు,
నల్లూరు నరసింహాచార్యులు
గుంటూరు జిల్లా
రేపల్లె తాలూకా
డిటో పోస్టు
నల్లూరు గ్రామం.

—

## నల్లూరిపాలెం ద్రవ్యసహాయకులు.

| | | | | |
|---|---|---|---|---|
| సుఖవాసి అంకినీడుగారు | రు | 2 | 8 | 0 |
| సబ్బనేని పున్నయ్యగారు | | 2 | 8 | 0 |
| డిటో బ్రహ్మయ్యగారు | | 1 | 0 | 0 |
| సుఖవాసి వెంకటరత్నంగారు | | 1 | 0 | 0 |
| డిటో పెదసుబ్బయ్యగారు | | 1 | 0 | 0 |
| డిటో లక్ష్మయ్యగారు | | 1 | 0 | 0 |
| డిటో చిననాగయ్యగారు | | 1 | 0 | 0 |
| డిటో బాపయ్యకొడుకు తాతయ్యగారు | | 1 | 0 | 0 |
| డిటో కోటయ్యకొడుకు తాతయ్యగారు | | 1 | 0 | 0 |
| అమినేని ముత్తయ్యగారు | | 1 | 0 | 0 |
| వీరవల్లి అమ్మయ్యకొడుకు రామస్వామిగారు | | 1 | 0 | 0 |
| యలవర్తి రామయ్యగారు | | 1 | 0 | 0 |
| సజ్జా చినరత్తయ్యగారు | | 1 | 0 | 0 |
| సజ్జా సుబ్బయ్యగారు | | 1 | 0 | 0 |
| కూచిపూడి వీరయ్యగారు | | 1 | 0 | 0 |
| మండా వెంకటాద్రిగారు | | 1 | 0 | 0 |





శ్రీరస్తు.

# రసికజనానందోదయ పదమాల



తే॥ గీ॥ శ్రీరమానాథ కాంచనచేల భక్త
వత్సల సరోజదళనేత్ర వాసుదేవ
భువిని నల్లూరిపురివాస భవవిదూర
మునిజనార్చిత మురహార మోహనాంగ॥

వ॥ అవధరింపుము॥

కం॥ ఆనందోదయ పదములు
క్షోణిని చిత్రముగ వ్రాసి సురుచిరముగ ల
క్ష్మీనాయక నీకొసగితి
మానుగ గైకొనియు నన్ను మన్నింపగదే॥

తే॥ గీ॥ బాల్యమున దల్లిదండ్రియు పరమపదము
నొందినప్పటినుండియు నుచితమతిని
సాకి విద్యలు నేర్పిన సాంద్రయశుని
రత్నమాచార్యులకును నే ప్రణుతి జేతు॥

తే॥ గీ॥ పేరుకలపూడివాసుడై పేరుగాంచి
నట్టి శేషయకవివర్య నమితయశుని

చెంతనేర్చితి కావ్యము♦ల్చెల్వుమీఱ
సత్కవీశ్వరమణులార♦సరసులార॥

వ॥ మదీయవంశానుక్రమం బించుక వివరించెద॥

తే॥ గీ॥ వసుధ నల్లూరివంశ పా♦వనుడు ఘనుడు
సరసవర్యుఁడు లక్ష్మణా♦చార్యసుతుఁడు
సకలశాస్త్రప్రవీణుండు♦సత్యశీలు
డర్థిజనపోషుడనఘుండు♦యమితయశుడు॥

తే॥ గీ॥ శాంతమూర్తియు వెంకటా♦చార్యవర్యు
డమిత వైభవమున క్రిష్ణ♦మాంబ యను
సాధ్విని వరించి భువిలోన♦చక్రిధరుని
కరుణచేనన్నుఁ గాంచిరి♦ఘనతరముగ॥

కం॥ నరసింహాచార్యుండను
పరగంగా నాంధ్రకావ్య♦పఠనీయుఁడ శ్రీ
ధరుని మనంబుననిడి భా
సురమగు పదములురచించి♦సొంపిలఁగంటిన్॥





# శ్రీ

# రసికజనానందోదయ పదములు.

## సరస్వతి ప్రార్థన

### 1. హిందూస్థానితోడి—ఆది.

శరణుసకలమునిజననుతి । శరణుభారతీ । నమో । నమో । నమో॥ నమో । నమో । నమో ॥నమోశ॥ సరసిజదళనేత్రినిన్ను । సన్నుతించెద॥ నమో । నమో । నమో । నమో॥ నమో। నమో। నమో ॥శ॥ పొలుపుగ వాగ్మందిరమున । నిలచి బ్రోవుమా॥ నమో। నమో । నమో । నమో॥ నమో । నమో । నమో ॥శ॥ పాపమతి నినన్నుగావ । కోపమేలనే॥ నమో । నమో । నమో । నమో॥ నమో । నమో । నమో ॥శ॥ అవనినల్లూరి । పురినినరసింహ్వా। యాఖ్యపోషిణీ॥ నమో । నమో । నమో । నమో । నమో । నమో। నమో ॥ శ ॥

### 2. హరిభక్తికీర్తనలు॥

మురహరనన్ను । బ్రోవరా ॥ము॥ పరమపావననామ । భంజనరిపునాశ॥ దురితహరణ(శ్రీ)శా॥ సకలేశ॥ ముర॥ సామజనుతనిను । నన్నునిజసేవ ॥ప్రేమమీరనను । బ్రోవరా ॥వేవేగ॥ ముర॥ వరప్రహ్లాదుని స్థిరముగనేలిన॥ గరుడగమనశౌరి । సర్వవైరీ ॥ముర॥ ధరణిలోనల్లూరి । పురమునవెలసిన్న । నరసింహ్వాదాసపోష । సువిలాస ॥ ముర॥

### 3. బ్యాండుస్వరమట్టు॥

మానిఘనాళికాగ్నిలోచనా॥ ఘనవమా । వినుమా॥ దీనజనా ।

... నొసూచలసే

ఠా కాంచనచేలా॥ అంగజరిపు । వందితశర । ణంటినిచాలా॥ మం
గళకర । నంగరరిపు । భంగఖగతురంగరార ॥మా॥ అరమరేలమో।
రవినిన । న్నాదరించరా॥ వరగానల్లూర్పట్టణ, పరిపాలభూవరా॥ నర
సింహ్వ । వరకవినుత । నరగునవను కరుణించుము ।మా॥

### 4. ఘరజురాగం—ఆది.

కృపజూడనసమయమిదె ॥శ్రీవరా॥ చపలుడననినిను। నరగున వేడితి॥ నివములెన్నకను । గావుమా॥కృ॥కుండలిశయననీ। యండజేరిన వాడ॥ దండిగనామొరా॥ లించుమా ॥కృ॥ నారసభవభవ । పన్నుత మురహర । గోరితినినుమది॥ రావేరా ॥కృ॥ దానులనేలెటి । దాత వునీవని॥ దోసిలొగ్గితినను । బ్రోవుమా ॥కృ॥ స్థిరముగనల్లురి । పురిన కరేశ్వర॥ నరసింహ్వకవివరి । పాలనా ॥కృ॥

### 5. ఫీల్ రాగం—అట॥

లీలామానుషరూప । జాలమేలనురా॥ పాలబడితినినన్ను॥ పాలించవేరా ॥లీ॥ అంగజజనకవిహంగతురంగ । సంగరరిపుమద॥ భంగశ్రీరంగ । ॥లీలా॥ మందరాచలధరగో॥ విందముకుంద ॥ యిందిరహృదయార॥ విందమిళింద ॥లీ॥ నల్లూరిపురివాస॥ నరసింహ్వపోష । ఫుల్లసరోజాక్ష । పూజజేసెదరా ॥లీ॥

### 6. ఖ్యాందుస్వరమట్టు॥

కోరినానురా ॥రారా॥ నన్నుబ్రోవవేగ ॥కో॥ మారజనకను తు । మారదీనమం । దారదురితపరి । హారధీర ॥కో॥

గానలోలయును । మానమేలనా । మాననమునునిను । మను వజాల ॥కో॥ సుందరాంగయుర । విందనయనముని । బృందవినుతరా। కేందువదన ॥కో॥ మేరుధీరన । ల్లూరిపురీవర శ్రీరమేశవర । సింహ్వపోష ॥కో॥

## శృంగార జావళీలు

### 7. మలయమారుతం — ఆది.

తరళాక్షి వానికి ॥తగదీపని ॥త॥ తరణిగ్రుంకువేళ । తమిహెచ్చెనని ॥ తరుణియట్టివచ్చితల్పుదియ్యుమనె ॥త॥ అతివలాతోబంతు । లాడుచుండగాను॥ వాతవుమీరననన్ను । యెగతాళిజేసె॥ త ॥ కల్లగాదునాడు । కాంతుడీప్సుమని ॥ మల్లెపూలదండ । మగువయివ్వవచ్చె ॥ త ॥ ధరణిలోనల్లూరి । నరసింహ్వాకవి॥ వరదుడిట్లుజేయు । వనితభావ్యమేన ॥ త ॥

### 8. జంఝూటి—ఆది॥

కాంతుడెటులబోయనె॥ కాంతరో॥ గనుమా ॥కాం॥ కాంతునినడబాసి । ఘుషిమైనతాళజాల । కంతునిబారికోర్వనె ॥ యింతివా ॥ డేనునె॥ కాం॥ వారిజనేత్రివానిపై ॥వలపు । హెచ్చెనే॥ సారెసారెకు యింత । చలమేలనెనాపై॥ నేరమేమొదెల్పడాయెనె॥ కూరిమిదలచెనె ॥కాం॥ స్థిరముగనల్లూర్పురిని । వెలయువారిని॥ నిరతమునమ్మితి । నెనరుంచడాయను॥ నరసింహ్వపోషకునితో । నగలసిపొమ్మనె ॥కాం॥

### 9. జంఝూటి—ఆది

గోపాలబాలనాపయింత॥ కోపమేలరా । రూపజాలతేమకమునా॥ ప్రాపుజేరరా ॥గో॥ పలుకవేరబిలచినయింత॥ చలమదేలరా॥ వలపుహెచ్చెనొక్కసారి॥ వచ్చిపోవెరా ॥గో॥ బిగువుగుబ్బలంటిముద్దు॥ బెట్టవేమిరా । ఖగకుతేంద్రశయుననన్ను॥ కౌగిలించరా ॥గో॥ ధరనునల్లూరిపురిశ॥ దానపోషక విరివిగనరసింహ్వాచార్య॥ వినుతగూడరా। ॥గో॥

## 10. హిందూస్తానితోడి—ఆది॥

కాముబారి । కోర్వ్యాజాల॥ రామనోహర॥ కో । మ । లాం ।
గా । కోర్కె । దీర్చ । వేఁడిధీవరా। ॥కా॥ తుమ్మెదలిల । ఝుమ్మ
నతల॥ దిమ్మబుట్టెరా॥ సా । మ్మా । సి । ల్లి । యున్న । దానా॥
సమ్మతింపరా ॥కా॥ చిన్నబుచ్చకు । నన్నుతాఁగ॥ చిన్నదానరా॥
వ । న్న । కా । డా । నిన్నా । బాసి । యున్నద్యుంటిరా ॥కా॥ ధ
రను । నల్లూరీపురీశదనుజసంహారా॥ ఏ । రా । ధీ । రా । మేరా । గా
డునరసింహా పోషకా ॥కా॥

## 11. హిందూస్తాని కాఫి—ఆది॥

ప్రేమజెందియుంటిని॥ కమలామనోహర । సామజేంద్రవరద
నాతో॥ సరసమాడరా ॥ప్రే॥ కుసుమశరుని బారికిమది॥ విసుకుజెందె
రా। కుసుమతల్పమునకు కేళి॥ గూడవేమిరా ॥ప్రేమ॥ పంకజాక్షుల॥
పైనయింత॥ పంతమేలరా । యింకనిన్ను మనుపజాల॥ నిపుడురావె
రా ॥ప్రే॥ ధరనునల్లూరి । పురీశదనుజభంజనసిరులొసంగిబ్రోవుము।
నరసింహాపోషక॥ ॥ప్రే॥

## 12. హిందూస్తాని—ఆది

రారాసామిగమరు॥ బారికినేనెటులోర్తునుయిక ॥రారా॥ మే
రా । గాదు తేరా కృపగనసమయము ॥రా॥ నిలచిమాట్లాడవేమి
నిన్నేమనంటిరా కలకలమని । శుకపికీ । ముబుగూశైనా । వలపిక
దీర్చర ॥రా॥ పంతమేలసామితమి । పాలైతిరావదేమిర । చెంతజేరి।
చనుమొనలంటగనుబుము సంతసమునిటు ॥రా॥ స్థిరముగన
ల్లూరి । వరలక్ష్మీనారాయణ । నరసింహా । కపిపాలా మొరవిని ।
వేగమె [illegible] బ్రోవగ ॥రా॥

## 13. హిందూస్తాని—అట

గోపాలబాలా । కోపమేలరదాని కోర్కెదీర్చరా ॥గో॥ పా
పవిదూర । పాడిగాదురయింత పంతమేలరా ॥గో॥ గుత్తపుచనులొ
త్తి । చిత్తజుకేళిని గూడిపోవెరా । తత్తరముచెలి । తలిరువిల్తుని
బాధకు త్తరినిల్వలేదురా ॥గో॥ చక్కనిసుందరి । పక్కమునగనీకు
దక్కెజూడరా । చక్కెరవిల్తుని । చానైనదానితో సరిరాదయిది
నమ్మరా ॥గో॥ ధారుణినల్లూరి । ధామనేరములెన్న మేరగాదురా
వారకనరసింహా । నందితశయ్యపై జేరి పల్కరించరా ॥గో॥

## 14. జంఝూటి—ఆది

రారామనోహర సేరమేమొ దెల్పరా ॥రా॥ మారునిశర
ముల । బారికిమనజాల ॥రా॥ పలుమారుబిలచిన పలుకవేమందురా
కులుకుగుబ్బలుబట్టి కోర్కెదీర్చవేమిరా ॥రా॥ మల్లెలు మొల్లలు
మంచిపన్నీ పెంగలు । కొల్లగదెచ్చిజడ లల్లియుంచినారసామి ॥రా॥
నల్లూరిపురివాస నరసింహకవిపోష । కల్లమాటలాడనేల గారవించు
చిద్విలాస ॥రా॥

## 15. కాఫి—ఆది.

బాలగోపాలనా । పైకృపలేదా । బాలింతనునాపై బడనేల ॥
బా॥ అత్తజూచినసరి । నెత్తురుపోగా । కత్తినంటిచెప్పి । ద్దత్తునెరు
గవా ॥బా॥ గుత్తపుచనులో । ప్పొత్తైనలేరా । సత్తునజూపిన । పై
పగజాల ॥బా॥ పచ్చిదేహమురా । పలుమరుగూడ । మచ్చికతోనా ।
మాటవినరా ॥బా॥ నల్లూరిపురిశ్రీ । వల్లభనీకు । చెల్లునయిదినర
సింహసుపోష ॥బా॥

16. జంఝూటి — అట — కానలో మట్టు.

మాటలునమ్మియిటులా । మోసపోతి । నీటుగుల్కుచు పూల తోటలో నీవు నేను । యాటలాడినట్టి పను । లన్ని మరుపాయెగద ॥మా॥ మాయలాడిగూడి పను । మరుబారికొప్పగించ । న్యాయమని । తోచెనా । నాథ నిను మరువజాల ॥మా॥ సొగసుగాడా వనినిను । మిగుల మోహించితి । వగలాడిని । జేరినాతో । పలుకవేమి । ప్రాణనాథ ॥మా॥ నిన్ను విడనాడి వేరె నెలత చెంత కేగనని । నీవ్మున్న బల్కినట్టి । నీమాటలు యేమాయెర ॥మా॥ ధరనుసల్లూరిపుర । నరసింహాచార్యపోష । నిరతమును । నిన్ను మది । నెరనమ్మితి । నిక్కముగ ॥మా॥

17. జంఝూటి — ఆది.

సదయహృదయునీ । సుదతులెవ్వరురా । పదేపదే బోయి దాని । బల్కరించెదవు ॥స॥ మందులమారిబల్ । మంచిదటంచు । సుందరాంగ దాని పొందుగోరితివి ॥స॥ ఆసించిన చెలి । నన్యాయముగా । బాసియితరులను । మరుగుటన్యాయము ॥స॥ ఇంతకు నేను నిన్నేమంటిని రా । పంతము బూనుట । భావ్యము గాదుర ॥స॥ విరివిగ నల్లూరి । పురమున వెలయు । నరసింహార్చిత నన్నేడ బాయకు ॥స॥

18. నవరోజు — రూపకం.

కమలాక్షనాపై । నీకు యింత । కపటమేలరా । సుమబాణుని । బాధ నాకు । నమితమాయరా ॥క॥ పలుకవేమి । పిలచిన నాతో । యలుక లేలరా । చెలువుడనే । చిన్నదాన । చింతదీర్పరా ॥క॥ శుకములు కో । కిలలును శా । రికములు గూసెరా । పరికటితముగ । భ్రమరగణము । రవములిడెంచెరా ॥క॥ ధరనుసల్లూ । రుపురనివాస । శ్రీ సపోషకా । నరసింహార్య । వందిత నుత । నారదార్చిత ॥క॥

### 19. ఫీల్ రాగం—అట—ప్రాణేశ మట్టు.

సురతము చాల్ చాలు । సొక్కియుంటినిరా । సరసుడయిక లేచి । జవరమొక్కిదనే ॥సు॥ గుత్తపుపాలిండ్లు । వత్తనులుమకు రా । సత్తువెలస్తునాపై । చాలాజూపకురా ॥సు॥ కమ్మనికెమ్మోవి। గంటుశేయకురా । నమ్మదమునముద్దు । చాలునలసితిరా॥సు॥యీ పనికినియింత । నేపై తెనికనే । నోపజాలనునీకు । కోపమేలనురా॥ సు॥ స్థిరముగనల్లురి । పురిలక్ష్మినాధ । నరసింహకవిపోష । నన్ను విడువుమురా ॥సు॥

### 20. హిందూస్తాని—ఆది—అంగనారో - మట్టు॥

జాలమేల జలజనేత్రిరారా । నీలవేణినిన్నె గోరియుండె॥జా॥ కుందనంపుబొమ్మముద్దుగుమ్మఅందమైన కనకాంగినమ్మ ॥జా॥ రతులందుమంచి జాణసామి । అతివనీపైభ్రమజెందెగాని ॥జా॥ బిగువుగుబ్బల్ గలయింతిమిన్న । మొగముమేలుసరజారికన్న ॥జా॥ ధరనువెలయు । నల్లురీపురీశ । నరసింహ్వదాసపోషశ్రీశా ॥జా॥

### 21 మోహన—ఆది.

ఏమందునె కామినీ ॥నా॥ సామిరాడేమందునే । కాము । బారి । కోర్వ । జాల । నయ్యయ్యో ॥ఏ॥ మాయలాడిమాటలు । వానికి । పాలుజెల్లమాయెనే । న్యాయ । మేమొ । గాని । వాని । కయ్యయ్యో ॥ఏ॥ పంకజాక్షులిండ్లలో । రేయి । పవలుపడకాయనె । పంకజాస్త్రి । డేచ । సాగె । నయ్యయ్యో ॥ఏ॥ చిలుకజెల్లగూకసె । మరుడు । నిలువనియ్యకుండెను । జాల । మేల । తాళ । జాల । నయ్యయ్యో ॥ ఏ ॥ నల్లూరిపురమందున । వెలయు । నరసింహకవినేలెటి । అల్లశౌరి । దెమ్మి । పొమ్మి । నయ్యయ్యో ॥ఏ॥

22 హిందూస్తానితోడి—ఆది—ఆప్రియమట్టు.

సామిగ్గానేబోయివచ్చెద । చాలగాకృపయుంచరా । కోమ లాంగ వినరనీపై । కోర్కెదీర లేదురా ॥సా॥ చిన్నదాంగ నిమిషమైనను । నిన్ను బాయలేనురా । పన్నుగామనకిద్దరికెడ । బాపెదైవము జూడగా ॥సా॥ పంచబాణుడునన్ను బహువే । ధించదలచెనిజంబుగా। కాంచనాంబర యింకనాకొక । ఘడియయుగమై దోచెగా ॥సా॥ ఇలను నల్లూర్పురిని వెలయు ర । మేశ నరసిజలోచన । సెలవొసంగుము వేగమే నర । సింహ్వాకవిపరిపాలకా ॥సా॥

23 హిందూస్తాని—ఆది.

మానినీమణీ । యను । మానమేలనే । సూనశరుని బారికినే। సొరగుచుంటినీ ॥మా॥ ఇంటనెవ్వరూ । లే । రిందిరేశుని । కంటు మాని నొక్కసారి । గలసిపొమ్మనే ॥మా॥ పిలువబిలువగా ।బహు। బిగువులాయనే । వలచియున్న చెలిని బాయ । భావ్యమానటే ॥మా॥ ధరనునల్లూరీ । పురి । ధాముడైన శ్రీ । ధరుడునన్ను మోసబుచ్చె । తరుణిగూడెనో ॥మా॥

24 కాఫీ—ఆది—జోహార్ అనుమట్టు.

శరణుశరణన్నాదిరా । శశివదన చిన్నాదిరా ॥శ॥ వారిజాక్షి నిన్నె । వలచెరా ॥శ॥ మారూనిరాణిరా। మగువపొలుపైనదిరా॥శ॥ కమలమొగడప్రాలిండ్లురా । కాముబారికోర్వ లేమురా । చీమలబారురా । చిగురుబోణినూగారురా ॥శ॥ వాతెర లేమావిచిగురురా । రతులందు బల్ జాణరా । నాతినలి వేణిర । నలినాక్షు నలుకేలరా ॥శ॥ ధరనునల్లూరి । పురిమాధవ । నరసింహకవిపాలకా । కరియానవేలర। కామకోటిసుందరా ॥శ॥

25 ఫీల్—ఆది—అహా యేమందు మట్టు.

అహా యేమందు । యీాయుగ్మలీ । యందము । హృదయ । మెచ్చరిక । నొందేటి । యీాచందము ॥అ॥ పడతినూగారు తేటుల బారు । పంచాస్యనొంచేటి । దానికౌనుతీరు ॥అ॥ చెలికెమ్మోవి విద్రుమంబు । బాలచంద్రునిగేరు మోముతీరుర ॥అ॥ సఖయచాచులుజాభావగిండ్లు । సాంకవగంధిర । స్వర్ణాంగిర ॥అ॥ ధరనల్లూరిపురివాస । నరసింహ్వాపోమనీకె నిదితగుర ॥అ॥

26 హిందూస్తానితోడి—ఆది—శంకర మట్టు.

సమయముగాదుర । సరసముల్లాడుటకు । కామముదీర్చుమని । గడ్డమంటెనవు ॥స॥ తలయేరుబాధనిపుడు । దరుచుగనున్నది । వలనుపడదుపోర । వచ్చిపైబడియదా ॥స॥ నిన్నరేయినకు । నిదురలేదుర సామి । పన్నగాశయనానన్ను । పండనివ్వుము దేవ॥స॥ కయ్యములాడకు । కమలసదనప్రియ । పయ్యెదకొంగుదోసి । పాలిండ్లుబట్టకురా॥స॥ సురమానిపూజిత । నరసింహ్వాచార్యార్చిత । మురహరనల్లురికేగి । మునిమాపురమ్మిపోమ్మి ॥స॥

తల్పుదగ్గిరపాట.

చక్రవాకం—ఆది—మంచిసమయ అను స్వరజతిమట్టు.

వాకిలితియ్యావే । వనజాక్షి । యనుమానమేలనిక ॥వా॥ ప్రకటముగమరు । బారికోర్వను । చిరాకుజెందబో । కేకసశాంగిరో ॥వా॥ వాకిలితియ్యాను । వనజాక్షి । వాదేలనాతోనిక । ప్రాకటముగమరు బారికోర్వనని । నీకుప్రియంబగు । నెలతతో జెప్పుము॥వా॥ జలజారివదన । నినుబిలచిన । బల్కవేటికి ॥జ॥ సలలితముగనీ । సరసజేరితిని । యలమాన్తినా । వలపుదీర్చుమిక ॥వా॥ జలజాయతా

షీ । ననుబిలుచు । పనియేమిజెప్పుమిక ॥జ॥ విలసితముగనీ । వలపు దీర్చేటి । చెలులెవ్వరుయిట । గలరనుచుంటివి ॥వా॥ కాంతానీవింతా । రవ్వంతా । నామాట వినవుగదె ॥కాం॥ ఇంతకన్ననా । కేస ఖగలదని । పంతగించియిటు । బల్కుచుంటివి ॥వా॥ కాంచనచేల । ననువంచన । సేయనేలనిక ॥కాం॥ ఎంచగాను వేరె। చంచలాక్షి లే। దంచుబల్కినమ । నంబుననమ్మను ॥వా॥ కానులుదెచ్చితీ । భాసురాంగిరో । వినగదె ॥కా॥ యేనఖనై నను । నేనెరూగనంచుబల్ । భాసజేతునను । వేసటబెట్టక ॥వా॥ భాసలింకేలా । నేవాకిలి । దీసితిరమ్మిక ॥బా॥ వాసిగనల్లూరు । వరపురమందున । భాసురముగనర। సింహార్చితపద । వాకిలిదీసితి॥

హిందూస్తానితోడి—ఆది—కాముబాతి మట్టు॥

తలుపుదగ్గరపాట.

తమకమోర్వ । జాలతరుణి। తలుపు తియ్యవే। కో।మా।లాం। గి। కోర్కి।దీర్చు । కోకిలవాణి ॥త॥ వనుదేవ । కుమారనేను । వాకిలీతియ్య । వా।స।వా।ది।మా।ని।నుత । వలపేలపోపార ॥వ॥ కాముబాధ । కోర్వజాల । కమలవదనరో । తా।మ।సం।బు।యే।ల।నా।పై। తప్పేమిజేసితి ॥త॥ మందరాద్రి । ధారణనీవు । మంచివాడవ । సుం। ద।రి।తో।నిన్న।రేయి। పొందలేదుర ॥వ॥ బొంకుమాటలాడబోకు । పంకజాక్షిరో । నిం।క।న।వ।రి।తో।పొం।దు। నింపుయెరుగనె ॥త॥ నవనీత । చోరుడనిను । నమ్మరాదుర । దు।వ్వా।లు।వ।ల।త।స్క।ర । దుష్టుడానీవు ॥వ॥ నీలవేణి । చోరుడనగ । నీకుజెల్లునె । క।ల।వ।ము। లెత్తు।కొని । కదలిపోతినా ॥త॥ పాలకుండకురంధ్రిమేసి । పాలుగ్రోలెదు । బా।ల।గో।పా।లా।కా।నీవు। బల్ మాయకాడవు ॥వ॥ మాటిమాటి । మాయకాడననీకు । మరియాదైనా । బో।టి।రో।యి। దేదె।

చ్చితి । పట్టుచీరెలు ॥త॥ పట్టుచీరెలు । గిట్టుచీరెలు । పట్టనురాసామి । వ|ట్టు|బె|ట్టి|ఛిన్న రేయి । వచ్చినావురా ॥వ॥ అవనినల్లూరి । పురినరసింహా చార్యదాసుడు । బో|ధ|వు|ను|ని|మొ|క్క|గాను, బోధిచుచుంటినె ॥త॥ అవనినల్లూరి । పురినరసిం । హాచార్యదాసుని। బోధివు|వా|డా|నై తె|రమ్మి । కవాటమును దీసితి॥

చందనమలదెదు పాట.

జంఝూటి—ఆది—కౌసలో మట్టు.

గంధముబూసెదనురా । సుందా । రాంగా । మందయానలెల్లనీకు । మల్లెపూల చెండ్లుగట్టి । అందముగదెచ్చిరను । వాందగను। గూర్చుండుము ॥గం॥ గరుడగంధర్వాకి । న్నరలుగూడి యాడగను । సురనారీమణులును । చోద్యముగ । బాడుచుండ ॥గం॥ అత్రిభరద్వాజకణ్వ । యాంగీరసకపిల గాధి । పుత్ర నారదాది మునులు । స్తోత్రములు సేయగను ॥గం॥ ధరనునల్లూరిపుర । ధామ । ముఖజితసోమ వరగనరసింహాకవి । పాల పావననామ ॥గం॥

చందనపాట—సదహ్రాద మట్టు.

జంఝూటి—ఆది.

చందనమలదెద ।చంచలాక్షిరో। సుందరాంగినిపుడునన్ను। సొంపుగగనుమా ॥చం॥ అత్తరుపునుగులో । నమర్చినగంధము । గుత్తపుగుబ్బలపై । గూర్చెదరావె ॥చం॥ మల్లెవిరులెత్తులు మత్తగమనరో । కొల్లగదెచ్చినాను । కోమలపాణిరో ॥చం॥ బిలచినబల్కవునీ బిగువులేలనే । అలరుతూపులకునే । నాగజాలను ॥చం॥ క్షితిని నల్లూరిపురి । క్షీరసింధుజప్రియుడన్ । అతివనే నరసింహా కవిపాలుడను ॥ చం ॥

పూలచెండ్లపాట—హాపిప్రియ మట్టు.

హిందుస్తానితోడి—ఆది.

గిరితనూజాధిపవినుతభా । మరశరీర రమేశ్వరా । విరులబంతుల నాడరా యీ । వెలదినీపై వేశరా ॥గి॥ కాంచనాంగిని । ఘడియలోనో । డించుమిందరుజూడగా । కాంచనమృదుచేలనీసరి । ఘనుడు లేడనిపించరా ॥గి॥ పాటలాధరులందరు బల్ । నీటుగుల్కుచు వీణెలు మీటి పాటలుపాడుచుండిరి । ఘాటిగాపీక్షింపుము॥గి॥ పరగనల్లూర్పట్టణాధిప । భక్తవత్సలబ్రోవరా । ధరణిలో నర । సింహ్వాకవినుత । దాపుజేరవదేమిరా ॥గి॥

పూలచెండ్లపాట—శంకరబ్రో మట్టు.

హిందూస్తానితోడి—ఆది.

పూలబంతులాట । పూబోణిరో మనము । సలలితముగనిపుడు । సఖియరో నాడుదము ॥పూ॥ మంచిమల్లెజాజులు । మంజులవాణిరో । కాంచనపుష్పములతో । గట్టినకందుకము ॥పూ॥ భామలందరుగుడి । భాసురముగజూడ । కమనీయ్యగాత్రినీవు । కందుకమెయ్యవే ॥పూ॥ పాటలిసురభిరో । పరమవేట్కతోనివు । పాటబాడుచు నాపై । బంతివిసరుసాధ్వి ॥పూ॥ నల్లూరిపురివాసు । నరసింహ్వాచార్యర్షిణుడ । కల్లమాటగాదిది । కమలదళలోచని ॥పూ॥

మంగళహారతి.

ఫీల్—ఆది—అహా యేమందు మట్టు.

కర్పూరనివ్వాళి । కాంచనచేల । కమలాలయపిప్రియ । కారుణ్యామదధి ॥క॥ జాభూవభాజనములో । జలజాయతాక్షులు । దెచ్చిరిదె ॥క॥ పినాకధారేయనుత । బిలేశశయ్యాచక్రిపాణి ॥క॥ వారణపో

తూణవారిజనాభ । వనజభవభవనుత ॥క॥ గోవర్ధనగోత్రగోపాలక గోటిలోనె త్తిన గోరక్షక ॥క॥ కాళ్యపినల్లూరి నరసింహ్వా । కరుణజూ చుముకవిపాలా ॥క॥.

మంగళహారతి.

హిందుస్తాని—ఆది.

పంకజలోచన । పాపవిమోచన మంగళంబిదె । సంకటహార ణాశ । శాంకధరార్చిత । మంగళంబిదె మునిజనపాలక । మురనర కాంతక । మంగళంబిదె । కనకచేలపాల్ । కడలిశయనశ్రీశ । మం గళంబిదె ॥పం॥ అంగజజనక వి । హంగగమననీకు । మంగళంబిదె । మంగళాంగస్సా । రంగపోషణనీకు । మంగళంబిదె ॥పం॥ ధరణిలో నల్లూరి పురిచక్రిధరనీకు । మంగళంబిదె । నరసింహ్వాకవిపాలా నన్ను బ్రోవరనీకు । మంగళంబిదె ॥పం॥

జోలపాట.

జోరఘురామ । జోజోముకుంద । జోజో శ్రీరామ జోజోనా దిత్యతిలక ॥జో॥ కాంచనాంబరధరణ కాంచనగాత్రవధీర । పంచబా ణజనక । పంకజనాభ ॥జో॥ నీలాభ్రశరీర । నీహారజవినుత । పాల మున్నీటిశయన । పాపభంజన ॥జో॥ వసుమతీభువనాధ । వనజభవవి నుత । దానజనపోషణ దశరథతనయ ॥జో॥ గాధితనయాధ్వర । గా చీనదేవా । అధికబలదైత్యపతిని । నంతమొనర్చిన ॥జో॥ ధరణినల్లు రిపురీశ । నరసింహాపాలా । వరలక్ష్మీనారాయణ । వరము లొసగు మురా ॥జో॥

మాలినీవృత్తము.

సురరిపు పరిహారా । సుందరాకారవీరా

నిరుపమగుణశీలా । నీవె నాదిక్కు రారా

ధరధరసమధీరా । దంతిపాలాయదేరా
శరణు జలజనేత్రా । చారులక్ష్మీకళత్ర॥

నిరోష్ఠ్యకందము.

ధరధరధర నారాయణ
సురసన్నుతధీరచరిత•సురుచిరదేహా
నరకాంతకలోకేశ్వర
కరిరక్షణ కనకచేల•కంజాక్షహరీ ॥

గద్య॥ ఇది శ్రీలక్ష్మీనారాయణచరణారవింద మధ్వంద బిందు తుంది
లేందిందిరాయమాన గౌతమసగోత్రపవిత్రకిష్ట
మాంబా గర్భ శుక్తిముక్తాఫల వెంకటా
చార్య తనూభవ సంగీతసాహిత్య
విద్యావైభవ సకలకవిజనవిధే
య నల్లూరు నరసింహా
చార్య నామధేయ
ప్రణీతంబైన
శ్రీ రసికజనానందోదయపదములు
సంపూర్ణము.

